# సంస్థాన ప్రజల సమస్యలు

దేశోద్ధారక గ్రంథమాల

అనుబంధప్రచురణము ౨



బహుధాన్య-ఫాల్గుణము

వెల రెండుఅణాలు

69

పండిత జవహర్ లాల్ నెహ్రూ

# ప్రజాభిప్రాయములు

## హైందవధర్మపోలీలు

(గ్రం. సు. ప్రతాపరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్.)

"సులభశైలిలో తేటతెలుగున వ్రాయబడినది. అంతా నుసికారని కణకణలాడు నిప్పుకణమే. అభివర్ణితములైనవన్నియు రక్తమునుడికెత్తించు వీర కథానకములు. హిందూదేశమునందలి వివిధప్రాంతముల చరిత్రలనుండి రసగుళికలనేరి శ్రీ ప్రతాపరెడ్డిగారు నూతనముగా ఒక చక్కని సారస్వత భూషణమును సమర్పించినారు" —మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

"వీరగాథలు మేనులు పులకరించునట్లు వచనములలో వర్ణించబడియున్నవి. జనులలో ప్రచారమందుటకు ఎంతయుతగియున్నది" —గోలకొండపత్రిక

"పెద్దలకూ, పిల్లలకూ కూడ సుబోధకంగా ఉండే ఒక సారస్వతభూషణం. ఇతిహాస ప్రసిద్ధమైన 'ధర్మపోలి' సమరము నాటి మహాయోధుల సాహసము, ధైర్య పరాక్రమాలు, వర్ణిస్తూ నెత్తురుఉడుకెత్తే వీరగాథలనుచక్కగా అభివర్ణించారు శ్రీ రెడ్డిగారు" —ప్రజామిత్ర

"ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపౌరుషము, పల్నాటివీరులకథలు, మేవాడ్ పతనము, రాయచూరు ముట్టడి [illegible]ము మున్నగు గ్రంథము లున్నప్పటికిని
[illegible]ది. కాని శ్రీరెడ్డిగారు రచించిన ధర్మపోలీల
[illegible]ంహావలోకన మొనర్చి, జాతిమత వివక్షత
[illegible] మనకందిచ్చినారు." —ఆంధ్రవాణి

[illegible], ప్రాచీనవైభవము, మన పతనమును కన్ను
[illegible]కమానదు." —ఆంధ్ర వారపత్రిక

[illegible]డ రక్తము నుడుకెత్తి, వడలుపులకరింప
[illegible]తములయందలి చరిత్రలనుండి సంగ్ర
[illegible]సుకూడ నర్థమానట్లు తేటతెలుగున
—గృహలక్ష్మి

[illegible]పుస్తకము చిన్నదేకాని, అంతానుసి
[illegible]తములైనవన్ని రక్తము నుడుకెత్తించు
[illegible] లిట్టివి కాలయవనిక మడతలలో ఎన్న
[illegible] శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి
—భారతి

[illegible]లు సులభమగునట్టియు, నుద్రేక
[illegible] వర్ణింపబడినవి. ఈ గ్రంథము తప్పక
—దివ్యవాణి



[illegible]మన్నాము.) —ప్రకాశకుడు

"దేశభాషలందు తెలుగు లెస్స"

# దేశోద్ధారక గ్రంథమాల.

---

ఈ గ్రంథమాల కీర్తిశేషులైన విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావుగారి స్మారక చిహ్నముగ స్థాపితమైనది.

ఆంధ్రముతప్ప వేరుభాష నెరుగని ఆంధ్రసోదరులలో ప్రపంచ జ్ఞానము కలిగించుటకును—పరభాషావ్యామోహమువలనగాని, విధిలేకగాని, మాతృభాషాభిమానములేని ఆంధ్రసోదరులకు మాతృభాషలో అవసరగ్రంథములను అందుబాటులోనుంచి—మాతృభాషాభిమానము కలిగించుటకును,—సర్వవిధముల, శక్తివంచనలేకుండ సేవచేయుటయే ఈగ్రంథమాల ముఖ్యఆశయము. ఈగ్రంథమాలద్వారా ప్రాచీన, ఆధునిక, వాఙ్మయ, రాజకీయ, వైజ్ఞానిక సాంఘిక విషయములకు సంబంధించిన గ్రంథములు సంవత్సరమునకు నాలుగు (మొత్తముపై ౪౦౦ ల పుటలకు తక్కువకాకుండ) ప్రచురింపబడుచుండును.

అనుబంధ ప్రచురణములుగా హైద్రాబాదు రాజ్యాంగమునకు సంబంధించిన చట్టములు, నియమావళులు, గష్తీలును, తదితరములును ముఖ్యమైనవి—రైతు, వర్తకసోదరులకు సంబంధించినవి—ఆంధ్రీకరించి ప్రచురింపబడును.

ఈగ్రంథమాలద్వారా ప్రచురింపబడు గ్రంథములను కొనుటకు లిఖితపూర్వకముగా నొప్పుకొనువారు గ్రంథమాల సభ్యులుగా ఎంచబడుదురు. అట్టిసభ్యులు ప్రథమమున నాలుగు అణాలు ప్రవేశరుసుముక్రిందను, (తపాలావ్యయముతోసహా) రూపాయ ఎనిమిదణాలు వార్షికమూల్యముక్రిందను ప్రథమముననే చెల్లించవలసియుండును. సంవత్సర మధ్యకాలములో ఎప్పుడు సభ్యులుగా చేరినను వారు సంవత్సరారంభమునుండి సభ్యులుగా నున్నటులే ఎంచబడుదురు. తిరిగి సంవత్సరారంభమున మొదటి ప్రచురణము వార్షికమూల్యముతో వి. పి. చేయబడును. అట్టి వి. పి. తిరుగగొట్టబడినచో వారి సభ్యత్వము వి. పి. వ్యయముక్రింద చెల్లుబెట్టుకొనబడును. గాన వారు సభ్యత్వమును కోలుపోయినవారగుదురు. తిరిగి సభ్యత్వమును గోరినయెడల లోగా అయిన తపాలా

వ్యయము చెల్లించవలసియుండును. అనుబంధ ప్రచురణములు సభ్యులు కొనవలయునను నిర్బంధములేదు. ఎల్లరకు ఒకేధరకు విక్రయింపబడును.

వట్టికోట ఆళ్వారుస్వామి
ప్రకాశకుడు

దేశోద్ధారక గ్రంథమాల,
ఇమాంబావివీధి, సికిందాబాదు.

---

# దేశోద్ధారక గ్రంథమాల

## సభ్యుల ప్రవేశ పత్రము.

ప్రకాశకులు గారికి,

నేను మీగ్రంథమాల నియమములను, ఆశయములను తెలిసికొనినాను. నేను సభ్యునిగా చేరుటకు అంగీకరించుచు ప్రవేశరుసుము క్రింద నాలుగు అణాలు, వార్షిక మూల్యముక్రింద రూపాయ ఎనిమిదిణాలు * తపాలాద్వారా పంపించుచున్నాను. వి. పి. ద్వారా రాబట్టుకొనుటకు కోరుచున్నాను.

సంతకము

పేరు

నివాసగ్రామము.

తపాలకార్యాలయము.

తాలూకా.

జిల్లా.

రశీదు సంఖ్య. తేది.

---

* తామేవిధాన మవలంభించెదరో దానినిమాత్రముంచి రెండవది కొట్టివేయవలెను.

# స్నేహహస్త సుభాషితాలు

గాంధిమహాత్ముడు చెప్పినట్లు, స్వాతంత్ర్యంకోసం భారతదేశంలో పోరాటం ఏ ప్రాంతంలో జరిగినా, అది అఖిలభారతసమరమే!

సంస్థానాలలోని ప్రజలు, భారతదేశంలోని యితర ప్రాంతాలలోని ప్రజలలో సమానంగా నడవడాన్ని నేర్చుకుంటున్నారు. వారికోసం మనం మాటి మాటికీ వెనకకు చూడవలసిన అవసరంలేదు.

మొత్తంమీద చూస్తే అనేక సంస్థానాలు అభివృద్ధి లేక చేతగాని తనంగా పడివున్నవి. నిరంకుశ ప్రభుత్వం ఒక్కొక్కప్పుడు క్రూరులూ, నీచులూఅయిన వ్యక్తులక్రింద ప్రాగిపోతున్నది. కాని రాజు మంచివాడైనా, చెడ్డవాడైనా, మంత్రి సమర్థుడైనా, కాకపోయినా, అసలు పద్ధతిలోనే దోషముంటున్నది. మిగతా ప్రపంచంనుండి ఈ పద్ధతి మాయమై పోయింది. ఇతరుల జోక్యంలేకపోతే ఈ పాటికి ఇండియాలో కూడా మాయమైపోయి ఉండేది.

పెద్ద సంస్థానములలో ప్రభుత్వాధికారులు బ్రిటిషు సామ్రాజ్య తత్వానికి తగినశిష్యులు అయిఉన్నారు. వీరు బ్రిటిషు సామ్రాజ్యతత్వమునుండి నేర్చుకున్న అనేక విష యాలతో పాటు ప్రజోద్యమములను అణిచివేయుటకు మతకలహములను సాకుగా ఉపయోగించుకోడంకూడా నేర్చుకున్నారు.

ఇండియాప్రభుత్వపు పొలిటికల్ డిపార్టుమెంటు వెనుక నుండి తాళ్ళు లాగుతూ ఉంటుంది. తెరమీద ఈ బొమ్మలు నాట్యమాడుతూ ఉంటాయి. స్థానిక రెసిడెంటులచే సర్వాధికారము. దీనికితోడు కొన్నాళ్ళుగా సంస్థానపతులకు దివాన్లుగా బ్రిటిష్‌వారినే వేస్తున్నారు. ఇదే స్వాతంత్ర్యం అయితే బానిసతనానికీ దీనికీ భేదం ఏమిటో తెలుసుకోవలసిందే!

భారతదేశ స్వాతంత్ర్యము అవిభక్తమగు సమస్య కాబట్టి, ఇట్టి గొప్ప సమస్యను ఖండించి చర్చించుటవలన ప్రయోజనము లేదని మనము గ్రహించి, ఇతరులు ఆ విషయమును గ్రహించుకునేలాగ చేయాలి.

బెజెల్ గెట్టీ విషాదమరణాన్ని మనము ఒక హెచ్చరికగా తీసుకుని, ప్రజలు అహింసా విధానమును గుర్తెరిగి దానికి బద్ధులై ఉండేలాగ మన ఉద్యమములను సాగించవలసి ఉంటుంది. వారు యీ విషయాన్ని మరచిపోయినట్లయితే వారి ప్రయత్నములకే విఘాతము కల్పించుకున్నవారు అవుతారు.

సంస్థానాలలో ఆర్డినెన్సుపాలన, స్వతంత్రసంస్థలను అణగద్రొక్కడం, బందిపోటులకే చెల్లదగిన పద్ధతులు: వీటన్నిటిని సహించమనడం ఇండియాను అవమానించడమే అవుతుంది.

ఇప్పుడు చాలా సంస్థానాలలో పౌరసత్వాలకే ఆందోళన జరుగుతున్నది. కాని గమ్యస్థానం బాధ్యతాయుత ప్రభుత్వం.

---

# సంస్థాన ప్రజల సమస్యలు



ప్రతి సంవత్సరమునూ, భారతసంస్థానప్రజామండలి సమావేశమై సంస్థానముల సమస్యల్ని చర్చిస్తోంది. సంస్థానములలో అమలులోవున్న నిరంకుశాధికారము దుష్పరిపాలన, అవినీతి వర్తనము, అధఃపతనములను యీ సమావేశంవారు ప్రతిసంవత్సరమూ ముక్తకంఠంతో ఖండిస్తూవున్నారు. ఈ సమావేశముల కృషియున్నూ యింకా యెక్కువగా కాంగ్రెసు కృషియున్నూ, ఫలించినవి. సంస్థాన ప్రజలలో గొప్ప ప్రబోధమూ, చైతన్యమూ కలిగాయి. భారతదేశ చరిత్రను యికముందు వ్రాసేటప్పుడు, దానిలో, ౧౯౩౮ సంవత్సరాన్ని యీ ప్రబోధానికి కారణమైన సంవత్సరంగా చరిత్రకారులు వ్రాస్తారు. ఎప్పుడో భవిష్యత్కాలంలో యీ చరిత్రను వ్రాసేవారు, సంస్థాన ప్రజలలో గలిగిన చైతన్యానికి ఆశ్చర్యాన్ని ప్రకటించారు. భారత సంస్థానంలోని లక్షలకొలది ప్రజలు, అక్కడి దుర్భరమైన పరిపాలనను, ఘోరమైన పరిస్థితులను అంతకాలం సహించి ఏలా ఊరుకున్నారా? అనీ, ప్రపంచములోని ఇతర దేశాలన్నిటిలోనూ అంతమొందిన ఈ పరిపాలనావిధానము భారతదేశంలో ఇంతకాలము యింకా ఏలావుందానీ? ఆశ్చర్యపోతారు.

## ౧౯౩౮

౧౯౩౮ సంవత్సరము దేశచరిత్రలో గొప్ప మార్పును

తెచ్చినది. మనమిప్పుడు ౧౯౩౯ సంవత్స రారంభములో ఉన్నాము. స్వాతంత్ర్యోద్యమం చకచకా నడుస్తోంది. సంస్థానాలలోని యీ గొప్ప సమరాన్ని భారతదేశ ప్రజలంతా కూడా సానుభూతితో, అర్థంచేసుకుంటూ, అటువైపు చూస్తున్నారు. ఇలాటి ముఖ్యమైన సమయంలో, నన్ను మీ సమావేశానికి రావలసినదని మీరు కోరినారు. మీ ఆజ్ఞప్రకారం నేను సంతోషంతో వచ్చాను. నేను మీవద్దకు యివ్వాళ్ళ కేవలమూ, సంస్థాన స్వాతంత్ర్య సమరంలో శ్రద్ధగల వ్యక్తిగా మాత్రమే రాలేదు, భారతదేశంలోని తక్కిన ప్రాంతాలవారి సానుభూతికి నిదర్శనముగానూ, మన అందరి ఐక్య భావానికీ చిహ్నంగానూ వచ్చాను.

## కాంగ్రెసు ధోరణి

సంస్థానాలపట్ల కాంగ్రెసుధోరణిని గురించి, యిటీవల చాలామంది వ్యాఖ్యానాలు చేశారు. సంస్థానాల విషయంలో కాంగ్రెసు జోక్యం కలుగజేసుకోవలెనా, కలుగజేసుకోవద్దా అనే విషయాన్ని గురించి తీవ్రమైన చర్చలు జరిగాయి. ఆ వ్యాఖ్యలునూ, ఆ చర్చలునూ, గతించిపోయిన నిన్నటి రోజులాగే గతించిపోయాయి. నేడు అవన్నీ అర్థరహితములుగా ఉన్నాయి. అయినా సంస్థానాల విషయమై కాంగ్రెసు ధోరణి ఏమిటో, ఆధోరణి క్రమక్రమంగా ఏలా మార్పు పొందుతూవచ్చిందో పరిశీలించడం కూడా మంచిదే. ఈ ధోరణిలో నిర్వచింపబడిన అభిప్రాయాలను నేను ఎప్పుడూ అంగీకరించలేదు. యీ

సమస్యకు సంబంధించిన కొన్ని విషయాలను గూర్చి మాత్రమే ప్రత్యేకశ్రద్ధ తీసుకోవడాన్ని నేను అంతగా యిష్టపడలేదు. అయితే అసలు యీధోరణిలోని మూల విధానము ప్రస్తుత పరిస్థితులతో సరియైనదని నేను విశ్వ సించాను. తరువాత జరిగిన సంఘటనలుకూడా ఆమాటలోని సత్యాన్ని ఋజువుపరచాయి.

దిట్టమైన మార్పునూ, విప్లవాన్నీ కలిగించడానికి ఒక విధానాన్ని అవలంబించేటప్పుడు ఆసమయంలోవున్న నిజపరిస్థితులతో సంబంధం పెట్టుకోకుండా వుండటానికి వీలు లేదు. పరిస్థితులు మారినకొద్దీ, అవలంబించే విధానంకూడా మారుతుంది. నిజపరిస్థితులతో సంబంధం పెట్టుకోకుండా, సాహసంతో మాట్లాడటమూ, సాహసాన్ని ప్రదర్శించడమూ, దిట్టమైన మాటలతో తీర్మానాలను గావించడమూవల్ల, విప్లవ కరమైన మార్పువచ్చే పరిస్థితులను, అవకాశాన్ని మనం కల్పించజాలము. కృత్రిమంగా ఆలాటి పరిస్థితులను కల్పించ డానికి వీలులేదు. ప్రజలంతా సంసిద్ధులుకాని సమయంలో ప్రజోద్యమాలను ఆరంభించకూడదు. కాంగ్రెసు యీ సంగతినీ, సంస్థానాలకు వెలుపల జరుగుతున్న స్వాతంత్ర్య సమరంలో కాంగ్రెసు తన యావచ్ఛక్తినీ వినియోగించింది. ఈ స్వాతంత్ర్య సమరంవల్ల, సంస్థానాలలోని ప్రజలలోకూడా మార్పుకలిగి తమ స్వాతంత్ర్యంకోసం పోరాడటానికి వారు కూడా సంసిద్ధులౌతారన్న విషయాన్ని కాంగ్రెసు తెలుసు కున్నది.

హరిపుర తీర్మానము ఒక మెట్టు

కాంగ్రెసు విధాన పరిణామములో హరిపుర తీర్మానము ద్వారా తెలియపరచినది. మనము పోరాడుతున్న స్వాతంత్ర్యానికి, భారతదేశపు సంఘీభావము, ఐక్యత చాలా అవసరము. భారతదేశంలోని అన్ని ప్రాంతాలకులాగనే, సంస్థానాలకు సాంఘిక, రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యము రావాలి. ఈ విషయంలో వేరే సర్దుబాటు ఏమీ లేదు. సంస్థానాలలో పౌరసత్వహక్కులూ, బాధ్యతాయుత పరిపాలన వుండితీరాలసి కాంగ్రెసు స్పష్టంగా ప్రకటించింది. సంస్థానాలలో వీటికోసం పోరాడటము తన హక్కు అనీ, బాధ్యతఅనీకూడా కాంగ్రెసు ప్రకటించింది.

ఈ విషయంలో తటస్థవిధానం అన్న ప్రశంస లేనే లేదు. భారతదేశానికీ, భారతదేశప్రజలకూ సంబంధించిన విషయాలలో కలుగజేసికోవడానికి, భారతదేశప్రజల కోర్కెలకు ప్రాతినిధ్యం వహించిన కాంగ్రెసు స్వాతంత్ర్యాన్ని అరికట్టడానికి అడ్డంకులు ఏమీ లేవు. భారతదేశపు మేలునుకోరి, పరిస్థితులనుబట్టి ఆలాటి విషయాలలో కలుగజేసికోవడము కాంగ్రెసువిధి. ఆలా చెయ్యకపోతే కాంగ్రెసు తనవిధిని నిర్వర్తించక, తాను పూనుకున్న కార్యానికి ద్రోహం చేసిన దవుతుంది:

అయితే, ఎప్పుడు జోక్యం కలుగచేసికోవాలో, ఏవిధానాన్ని అనుసరించాలో, ఏవిధానాన్ని అనుసరిస్తే

తాము జోక్యం కలుగజేసికోవడంవల్ల ఫలితం కలుగుతుందో, భారతదేశ ప్రజలున్నూ, కాంగ్రెసున్నూ నిర్ణయించుకోవాలి. కాంగ్రెసు తనవిధానం విషయంలో ఏవైనా నిర్బంధములను పెట్టుకున్నదంటే, అవన్నీ పరిస్థితులనుబట్టి అవసరమనుకొని కాంగ్రెసు పెట్టుకున్నవేగాని, యింకొకరు పెట్టినవిగావు.

భారతీయప్రజల ఆశయాలకున్నూ, అభివృద్ధికిన్ని యింకొకరెవరూ ఏలా నిర్బంధాలను పెట్టలేరో, ఆలాగే, కాంగ్రెసు కార్యక్రమానికికూడా యింకొకరెవరూ నిర్బంధాలను నిబంధించలేరు. సంస్థానాలు వెనకపడివుండటం వల్ల జాతీయాభివృద్ధికి ఆటంకం కలిగిందనీ, సంస్థానాలు ప్రస్తుతం ఉన్నస్థితిలోనుంచి మారితేగాని భారత దేశానికి నిజమైన స్వాతంత్ర్యం వుండదనీ కాంగ్రెసు స్పష్టంగా గ్రహించింది. అవసరమైన యీ మార్పును తీసుకరావడానికి కాంగ్రెసు త్వరపడుతూనే ఉన్నది. అయితే, యీ మార్పు సంస్థాన ప్రజలలోనే కలగాలనీ, ఆలా జరగాలంటే సంస్థాన ప్రజలు స్వశక్తిమీద ఆధారపడేవారుగానూ, పరిపాలనా బాధ్యతను నిర్వహించేవారుగానూ ఉండాలన్న విషయాన్ని కూడా కాంగ్రెసు గ్రహించింది. అంచేతనే కాంగ్రెసు యీ విషయములో పట్టుపట్టింది. ఆలా చెయ్యకపోతే, తప్పుదారిని నడవడమవుతుంది. ప్రజలశక్తికీ, ఐక్యానికీ ప్రాతినిధ్యం వహించే సంస్థలు సంస్థానాలలో ఏర్పడడానికి వీలులేకుండా పోతుంది.

హరిపుర కాంగ్రెసు అనంతరం జరిగిన పరిణామాలను

మనం చూపినట్లయితే, కాంగ్రెసు దూరాలోచన ఎంతో సమంజసమైనదని మనము ఒప్పుకొనక తప్పదు. అన్ని సంస్థానములలోను సంచలనము కలిగింది. కొన్ని సంస్థానాలలో, గొప్పశక్తిగల ప్రజోద్యమాలు పని చేస్తున్నాయి. సంస్థానాలలోని ప్రజలు, భారతదేశంలోని యితర ప్రాంతాలలోని ప్రజలతో సమానంగా నడవడాన్ని నేర్చుకుంటున్నారు. వారికోసం మనం మాటిమాటికీ వెనుకకు చూడవలసిన అవసరంలేదు. స్వాతంత్ర్యసమరాన్ని వారే నేడు వేగంగా నడిపిస్తున్నారు. నేటి భారతజాతీయ రాజకీయాలలో ప్రముఖత్వాన్ని సంస్థాన ప్రజల స్వాతంత్ర్య సమరమే పొందుతున్నది. ఈ పోరాటాలన్నిటినీ బ్రిటిషు సామ్రాజ్య తత్వాన్ని ప్రతిఘటించే ఒకేఒక పోరాటంగా చెయ్యవలసిన సమయంవచ్చింది. స్వాతంత్ర్యంకోసం జరిగే వివిధపోరాటాలు ఇహ యిప్పుడులేవు, ఇప్పుడు ఒకే ఒక గొప్ప సమరం జరుగుతున్నది. ఆ సమరంలో యుద్ధరంగాలు అనేకం వుండవచ్చును, సమరవిధానాలు మారవచ్చును. కాని సమరం మాత్రం ఒక్కటే.

గాంధిమహాత్ముడు చెప్పినట్లు, స్వాతంత్ర్యంకోసం భారతదేశంలో పోరాటం ఏ ప్రాంతంలో జరిగినా, అది అఖలభారత సమరమే.

ఇలాటి గొప్ప తీవ్రమైన సమస్యగల యీ సమయంలో, అన్ని వేళలలోనూ భారతదేశ స్వాతంత్ర్యాన్ని గురించి ఆలోచిస్తూ, భారతదేశ గౌరవాన్నిగురించి పట్టుదల

పూనుతూవున్న భారత జాతీయనాయకా గ్రెసరుడు ముందుకు రావాలి. భూమ్యాకాశాలలో ప్రతిధ్వనించే వృద్ధకంఠంతో ఆయన చేసే ప్రబోధాలతో భారతదేశ ప్రజలకు ధైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని యివ్వాలి. ఈ సంస్థానాల సమస్యను వెనుక పడవేసిన చిల్లర విషయాలన్నిటిని గాంధిమహాత్ముని నాయకత్వము పరిష్కరించివేసింది. ఇప్పుడు యీ పెద్ద సమస్య స్పష్టమైనది.

భారతదేశంలో మొత్తంమీద పెద్దవీ, చిన్నవీ కలిసి రమారమి ౬౦౦ సంస్థానాలున్నవి. వీటిలో కొన్ని భూగోళంలలో సూచించడానికికూడా వీలుకేనంత చిన్నవి. వీటిలో ఒక్కొక్కదాని మధ్య ఎంతో భేదంవున్నది. పరిశ్రమలలోను, విద్యలోనూ కొన్నిచాలా అభివృద్ధిపొందినవి. కొన్నిటికి సమర్థులైన రాజులో, మంత్రులో ఉన్నారు, కాని మొత్తంమీద చూస్తే అనేక సంస్థానాలు అభివృద్ధిలేక చేతగాని తనంగా పడివున్నవి. నిరంకుశ ప్రభుత్వం ఒక్కొక్కప్పుడు కూరులూ, నీచులూ అయిన వ్యక్తులక్రింద సాగి పోతున్నది. కాని రాజు మంచివాడైనా, చెడ్డవాడైనా, మంత్రి సమర్థుడైనా, కాకపోయినా అసలు పద్ధతిలోనే దోషంఉన్నది. గత ప్రపంచమునుండి ఈ పద్ధతి మాయమై పోయింది. ఇతరుల జోక్యంలేకపోతే ఈపాటికి ఇండియాలో కూడా మాయమైపోయిఉండేది. కాని ఇవి కుళ్ళి, కృశించి పోవడం స్పష్టంగా కనబడుతున్నా బ్రిటిష్ సామ్రాజ్యవాదం వీటిని కృత్రిమంగా నిలబెట్టుతున్నది.

ఇండియాలో బ్రిటిష్ అధికారంవల్ల పుట్టిన-స్వప్రయోజనాల కొరకు సామ్రాజ్యవాదం తమ్ము పీలుస్తుండగా ఇంత వరకూ ఇవి కొన ప్రాణంతో నిలిచిఉన్నవి. యీ లోపున ప్రపంచం అంతటా మహా విప్లవాలు చెలరేగి సామ్రాజ్యాలు శిథిలమై, రాజులూ, అల్ప ప్రభువులూ గుంపులు గుంపులుగా విస్మృతి గర్భంలో మునిగిపోయారు. ఈ పద్ధతికి అంతర్గతంగా ప్రాముఖ్యంగాని, బలంగాని లేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాద బలమే దీనిబలం. ఇండియాలోని మనకు ఈ పద్ధతి బ్రిటిష్ సామ్రాజ్యవాదపు అనేకముఖాలలో ఒకటిమాత్రమే. అందువల్ల సంఘర్షణ వచ్చినప్పుడు మన నిజమైన శత్రువులెవరో గుర్తించాలి.

ఇటీవల మనం సంస్థానాల స్వాతంత్ర్యాన్ని ముట్టుకోవడానికి వీలులేదనీ, బ్రిటిష్ వారు కావించుకొన్న సంధులు పరమ పవిత్రమైనవనీ, కలకాలం ఆప్రకారమే జరగాలనీ ఒకవాదం వింటున్నాము. సామ్రాజ్యవాదానికి నచ్చకపోతే ఎంతపవిత్రమైన అంతర్జాతీయ ఒడంబడికలకుకూడా ఎట్టిగతి పట్టుతున్నదో మనం చూస్తూనే ఉన్నాము. వీటిని చింపివెయ్యడం, స్నేహితులకు ద్రోహం చేయడం, ఆడినమాట తప్పడం ఇవన్నీ బ్రిటన్, ఫ్రాన్సులు చేశాయి. అయితే వీటివల్ల నష్టంఎవరికి? ప్రజాస్వామ్యానికీ, స్వాతంత్ర్యానికీ! అందువల్ల పరవాలేకపోయింది. కాని ఆనష్టం, నిరంకుశత్వానికే సామ్రాజ్య వాదానికేవస్తే? అప్పుడీ సంధిపత్రాలకి ఎక్కడలేని విలువా వస్తుంది. ఇవి ఏలాటివైనా, ఎంత చెదలు

పట్టినాసరే ప్రజలకెంత నష్టదాయకమైనాసరే వీటిని పోనివ్వకూడదు. ౧౯౫౫ ఏళ్ళకిందట జరిగిన ఈ ఒడంబడికలు, వీటిని చెయ్యడంలో ప్రజలకు ఎట్టి బాధ్యతా లేకున్నప్పటికీ, ప్రస్తుతం వర్తించి తీరాలనడం రాక్షసమైనపని. బలవంతంగా, మాయచేసి తొడిగిన సంకెళ్ళను విప్పుకోవద్దంటే ప్రజలు మానుతారనుకోవడం వెర్రి. వీరి రక్తాలు తోడుతున్న పద్ధతికి కట్టుబడి ఉండమనడంకూడా ఇట్టిదే. మేము ఇటువంటి ఒడంబడికలు వేటినీ గుర్తించము. ఏమి జరిగినా సరే వీటికి అంగీకరించము. మేము గుర్తించే అంతిమప్రభుత్వం; సార్వభౌమశక్తి, ప్రజాసంకల్పం మాత్రమే: చివరకు మేము కోరేది ప్రజల క్షేమం మాత్రమే.

ఇటీవల సంస్థానాల స్వాతంత్ర్యం గురించి ఒక క్రొత్తవాదం చేస్తున్నారు. ఆ సంస్థానాలను తమ ఇనుప పిడికిలిలో ఉంచి వారిని అణగద్రొక్కుతున్నవారే! చరిత్ర గాని, రాజ్యాంగతత్వ న్యాయశాస్త్రంగాని దీనిని సమర్థించ లేవు. ఈ సంస్థానాల పాతచరిత్ర తిరగవేస్తే వీరిలో చాలా మంది ఫ్యూడల్ ప్రభువులని తెలుస్తుంది. కాని మనం న్యాయశాస్త్రంలో పరిశోధనలు సాగించ నక్కరలేదు. అన్ని సంగతులూ మన కళ్ళముందే కనబడుతున్నవి. సంస్థానాలమీద అధికారం అంతా బ్రిటిష్ ప్రభుత్వానిదే. బ్రిటన్ అడుగులకు మడుగులొత్తుతూ ఈ సంస్థానాలు నడుచుకోవాలి. ఏమాత్రం ధిక్కరించినా వీరిపని సరి. ఇండియా ప్రభుత్వపు పొలిటికల్ డిపార్టుమెంటు వెనుకనుండి తాళ్ళు లాగుతూ ఉంటుంది. తెరమీద ఈ బొమ్మలు నాట్య

చూడుతూ ఉంటాయి. స్థానిక రెసిడెంటు దే సర్వాధికారమూ. దీనికితోడు కొన్నాళ్ళుగా సంస్థానపతులకు దివాన్లుగా బ్రిటిష్ వారినే వేస్తున్నారు. ఇదే స్వాతంత్ర్యం అయితే బానిసతనానికీ, దీనికీ భేదం ఏమిటో తెలుసుకోవలసిందే! సంస్థానాలలో స్వాతంత్ర్యం లేదు, ఉండబోదు. ఇండియా వేరు, మేము వేరు అనుకోవడానికి వీలులేదు. సంయుక్త స్వతంత్ర భారతదేశం అనే అభిప్రాయానికే ఇది విరుద్ధం. పెద్ద సంస్థానాలలో స్వతంత్రత అంటే ఒప్పుకోవచ్చును. తమ భూభాగంలో స్వపరిపాలన అనుభవిస్తూ అందరికీ చెందిన సమస్యలలో ప్రజాస్వామిక ఫెడరల్ కేంద్రానికి కట్టుబడి ఉంటాయి. వీటిలో పరిపాలన బాధ్యతాయుత ప్రభుత్వ సూత్రంమీద నడుస్తుంది.

### సంస్థానాధిపతులకు హెచ్చరిక

ప్రజలకూ, రాజుకూ మధ్య అయినయెడల ఈ సమస్య వెంటనే పరిష్కారమయి పోతుందని స్పష్టమే. చాలామంది సంస్థానాధీశులు పైవారి జోక్యం లేకపోతే ప్రజలతోనే కలిసిపోతారు. ఒకవేళ సందేహించినా ప్రజల ఒత్తిడివల్ల వీరు తమ అభిప్రాయం మార్చుకోవలసి వస్తుంది. అట్లు చెయ్యకపోతే వారి స్థితికే భంగంవచ్చి పదభ్రష్టులు కాకతప్పదు: కాంగ్రెసూ, వివిధ ప్రజామండలులూ, సంస్థానపతులు ప్రజలపక్షం కావాలనీ, బాధ్యతాయుత ప్రభుత్వం ఇవ్వాలనీ కోరినవి. ఇందుకు అంగీకరించక పోయినంతమాత్రాన్ని ప్రజా స్వాతంత్ర్యం ఆగిపోతుందని వీరనుకోవడానికి వీలులేదనీ గ్రహించాలి. వీరి ప్రతిఘటనవల్ల

ప్రజలకూ, తమకూ మధ్య పెద్ద అడ్డొకటి బయలుదేరుతుంది. అప్పుడు ఇరువురి విభేదాలూ సరిపెట్టుకోవడం చాలా కష్టం అయిపోతుంది.

గతించిన నూరేళ్ళలో ప్రపంచపటం ఎన్నోసార్లు మారిపోయింది. సామ్రాజ్యాలు సమసిపోయినవి. క్రొత్త దేశాలు బయలుదేరినవి. ఇప్పుడుకూడా, మనకళ్ళముందే ఇట్టి మార్పులు మనం చూస్తున్నాము. ఇన్నాళ్లూ తమ్ము రక్షించిన బ్రిటిష్ సామ్రాజ్యంవలెనే, ఈ సంస్థానాలుకూడా నశించిపోతాయని చెప్పడానికి పెద్ద జ్యోతిషం అక్కరలేదు. కాబట్టి సంస్థానపతులు కళ్లుతెరచి ప్రజలతో కలిసి వారి నూతన స్వాతంత్ర్యంలో పాల్గొనడమో లేక అందరూ అసహ్యించుకొనే నిరంకుశత్వం అవలంబించి అనుక్షణం పదభ్రష్టతకు సిద్ధపడడమో నిర్ణయించుకోవాలి.

ఇది గ్రహించి కొందరు సంస్థానాధీశులు సరియైన మార్గం త్రొక్కుతున్నారు. వీరిలో ఒకరు—ఎంతో చిన్న సంస్థానమైనఔంధ్ అధిపతి. సహృదయంతో, అయాచితంగా ప్రజలకు బాధ్యతాయుత పరిపాలన ఇచ్చి వాసికెక్కాడు.

కాని చాలామంది సంస్థానప్రభువులు తమ పాత పద్ధతులకే కట్టుపడి మారాలనే అవసరం సూచించకుండా ఉన్నారు చరిత్ర నేర్పిన పాఠం వీరుమళ్ళీ బోధిస్తారని తోస్తుంది. ఒకవర్గం తనఅవసరం తీరినపిమ్మట కృశించి, తెలివీ, శక్తీ నశించి నిర్మూలమవుతుందని చరిత్ర తెలుపుతున్నది. మారిపోతున్న పరిస్థితులకు అనుగుణ్యంగా తానుకూడా మారలేక నశించి పోతున్నదానిని పట్టుకొని

ప్రాకులాడడంవల్ల దక్కేదికూడా దక్కకుండా పోతుంది. బ్రిటిష్ పరిపాలకవర్గం వంటిదే మనకళ్ళముందు ఏమైపోతున్నదో చూడండి. గతశతాబ్దంఅంతా విశేష విఖ్యాతి గడించి గొప్పసామ్రాజ్యం స్థాపించింది. ఇప్పుడు మాత్రం బలహీనమై, బుద్ధిచెడి, ఇతికర్తవ్యతామూఢమై, ఉన్నది. నిలుపుకోవడానికి అటూ ఇటూ పరుగెత్తుతూ ప్రతిష్ట మంట కలిపి, తన సామ్రాజ్యసౌధాన్ని కూలద్రోసు కొంటున్నది. తమపని నెరవేర్చి, అవసరానికి మించి నిలిచిన వర్గాల సంగతికూడా ఇంతే. చిరకాలశిక్షణ, సంప్రదాయం, ప్రతిష్ఠకలిగిన బ్రిటిష్ పరిపాలకవర్గాలే సన్నగిల్లుతుంటే, చిరకాలంనుండి క్షీణిస్తూ బాధ్యతలేని వర్తనకు పాల్పడ్డ మన భారతసంస్థానపతులమాట ఏమిచెప్పవచ్చును. పరిపాలన అంటే పోలోగుర్రాలనూ, కుక్కలజాతులనూ తెలుసు కోవడం, కాడెరుగని జంతువులను చంపివెయ్యడమూకంటె ఎక్కువ కావలసిఉంటుంది.

కాని సంస్థానపతులు ఇష్టం ప్రదర్శించినా, అంత మాత్రంచేత ఎంతో ముందుకు రాలేరు. వీరంతా బ్రిటిష్ ప్రభుత్వపు ఏజెంట్లచేతిలోనివారు. మొన్న మొన్న రాజకోట సంస్థానపతి ఒడంబడికకు కాదలచుకొంటే పదభ్రష్టుని చేస్తామని భయపెట్టి బ్రిటిష్ ఏజెంటు అతనిచేత ఏవిధంగా మాట జవదాట చేశాడో మనం ఎరుగుదుము.

### తాటస్థ్య సమస్య

ఈ విధంగా చూస్తే సంస్థానాలలోని సమస్యకు అద్భుట అధిపతులు నిమిత్తమాత్రులే అనీ, అసలు సంఘర్షణ బ్రిటిష్

సామ్రాజ్య వాదంతో అనీ కనబడుతుంది. అందు చేతనే ప్రజలకు విరుద్ధంగా సంస్థానాలలో బ్రిటిషు ప్రభుత్వం కలుగజేసుకోవడానికి ప్రత్యేకార్థం ఉన్నది. నానాటికి ఇది హెచ్చిపోవడం మనకు కనబడుతుంది. రాజకీయంగా, ఏజంట్లూ రెసిడెంట్లూ ద్వారా మాత్రమే కాదు, ఒరిస్సాలో వలె బ్రిటన్ ఆయుధ సామగ్రితో కూడా. ఈ విధంగా ప్రజల ఉద్యమం అణగద్రొక్కడానికి బ్రిటన్ చెయ్యి చేసుకోవడం మనం యికమీద సహించము. ప్రజలను అణగద్రొక్కడానికి బ్రిటిష్‌ప్రభుత్వం బయలుదేరితే ప్రజారక్షణకు నేషనల్ కాంగ్రెస్ పరిపూర్ణ శక్తులతో ప్రవేశిస్తుంది. కాంగ్రెస్ పద్ధతులుమాత్రం వేరు. ఇవి శాంతి పూరితమైనవే, కాని శక్తిసంపన్నమైనవని ఇదివరకు చాలాసార్లు విదితమైనది.

ఈ సంఘర్షణ ముదరనిస్తే చాలా ఉపద్రవాలు కలుగకతప్పదని గాంధీమహాత్ముడు బ్రిటిష్ ప్రభుత్వానికీ, ఇండియాలో వారి ఏజంట్లకూ పదేపదే హెచ్చరించాడు. ప్రత్యేక సంస్థానాలలో ఈ విధంగా ఉన్నప్పుడు రాష్ట్రాలలో కాంగ్రెస్‌ప్రభుత్వం బ్రిటన్‌తో సహకారంచేస్తూ నడవడం మరీకష్టం. ఇది మహాసంఘర్షణగా పరిణమిస్తే దీని ఫలితం ఇండియా మూలమూలలకు వ్యాపించుతుంది. అప్పుడు ఏదోఒక సంస్థానంలో ఏమిటికలగాలి అనేసమస్య కాక బ్రిటిష్ అధికారాన్నే పూర్తిగా తొలగించడమనే సమస్య బయలుదేరుతుంది.

ప్రస్తుతం జరుగుతున్న సంఘర్షణ వైఖరిఎట్టిది? దీనిని జాగ్రత్తగాఅర్థంచేసుకోవాలి. ఒకసంస్థానానికీ ఒకసంస్థానానికి ఈవిషయంలో కొద్దిగా భేదంఉన్నది. కాని మొత్తంమీద అంతటా బాధ్యతాయుత ప్రభుత్వంకోరుతున్నారు. కాని ఈకోరిక చెల్లడానికికాదు. సంఘర్షణ. దీనిని ప్రజలు వెల్లడించడానికి సంస్థలుగా ఏర్పడేహక్కు కోరడానికి మాత్రమే. ఇదే నెరవేరకపోతే ఇక పౌరస్వాతంత్ర్యమే లేదన్నమాట. అప్పుడు "చట్టసమ్మతంగా" ఆందోళన చెయ్యడానికి వీలుండదు. అట్లయితే ఇక ప్రజ తమకోరికలన్ని వదలుకోవాలి. తమ కోరికలు వదలుకోవడమంటే అధోగతిలో పడిఉండడ మన్నమాట. నిరంకుశపాలనకు తలయొగ్గి ఉండమన్నమాట, తీవ్రిచగ్య అంటే శాంతియుత సత్యాగ్రహం హింసకూ, పాపానికీ లొంగకపోవడం అన్న మాట. కావున ఇప్పుడు చాలా సంస్థానాలలో పౌరస్వత్వాలకే ఆందోళన జరుగుతున్నది. కాని గమ్యస్థానం బాధ్యతాయుతప్రభుత్వం. జయపూర్‌లో ఇంకా స్వల్ప సమస్య అనవచ్చును. ఏమంటే అచ్చటి ప్రజామండలి క్షామనివారణకు ప్రయత్నిస్తామంటే అధికారులు ఒప్పుకో లేదు.

## బ్రిటన్ శాంతి ప్రియత్వం

ప్రస్తుత బ్రిటీష్ మంత్రివర్గానికి చెందినవారు తమ అంతర్జాతీయ విధానాన్ని సమర్థించుకోనడానికి యుద్ధంఅంటే చాలా ఘోరమైనదనీ, తామెంతో శాంతిప్రియులమనీ ప్రకటిస్తున్నారు. శాంతికనీ పరితోషానికనీ, వీరు బందిపోటు

దొంగతనానికి ప్రోత్సాహం ఇచ్చారు. యూరప్‌లో ప్రజాస్వామ్యానికీ, స్వేచ్ఛకూ ఎంత విఘాతం కలిగించాలో అంతా చేశారు. తమ విధానంవల్ల దౌర్జన్యానికి పట్టం కట్టారు. ఆధునిక యుగంలో అత్యంత విషాదకరమైన రిపబ్లికన్ స్పెయిన్ పరాజయానికి తోడ్పడ్డారు. రెండేళ్ళ నుండీ అనేక కష్టాలకోర్చి యుద్ధంచేసినా స్పెయిన్‌కు ప్రయోజనం లేకపోయింది. అయినా ఈ బ్రిటిష్ రాజకీయ వేత్తలు శాంతియుత పరిష్కారపు లాభాలనూ, హింసా దౌర్జన్యాల చెడుగునూగూర్చి మాట్లాడడం మానరు. ఇట్టి భావాలను వీరు ప్రచారం ఎందుకు చేస్తున్నారంటే స్వేచ్ఛను నిరంకుశత్వం అడ్డులేకుండా కాలద్రొక్క గలిగేటట్టు చెయ్యడానికే.

ఇండియాలో ముఖ్యంగా సంస్థానాలలో మనం చూస్తున్నదేమిటి ? శాంతియుత ప్రచారానికి, శాంతియుత సంస్థాననిర్మాణానికి, శాంతియుత సమాధానానికి. మనం చేసిన ప్రయత్నాలన్నిటినీ సంస్థానాధికారులు బ్రిటన్ ఆయుధబలంతోను రాజకీయపు పలుకుబడితోను ఎదిరిస్తున్నారు. ప్రజాస్వామ్యానికీ, స్వాతంత్ర్యానికీ దారితీసే సంస్కరణలను ఎంత శాంతియుతంగా కోరుతున్నా అట్టి కోరికలను నిర్దాక్షిణ్యంగా బలప్రయోగంతో అణగద్రొక్కుతున్నారు. కాని సామ్రాజ్యవాదానికి, ఫాసిజంకు అనుకూలమైన మార్పులు కావాలంటే శాంతి అక్కరలేదు. అప్పుడు ఎంత హింసకైనా అవకాశం ఉంది. స్వాతంత్ర్యం రక్షించుకో దలచినవారినీ అడ్డడానికే ఈ శాంతి విధానం.

సంస్థానాలలో చండశాసనత, నిరంకుశత్వం, కుటిల పరిపాలన సాగాలని ఇంకా యెవరైనా కోరుతున్నారా? ఇపన్నిపోయి స్వతంత్ర సంస్థ లేర్పడకూడదని యెవరైనా అంటారా? అయితే మరి ఆమార్పు సహజంగా రావాలంటే సరియైన ప్రజాభిప్రాయం ఏర్పడగల సంస్థలకు పరిపూర్ణావకాశం ఇవ్వవద్దా? ఎట్టి అభివృద్ధికైనా పౌరసత్వాలే మొట్టమొదట నెలకొనవలసిన అవసరముంన్నది.

సంస్థానాలలో ఆర్డినెన్సు పాలన, స్వతంత్రసంస్థలను అణగద్రొక్కడం బందిపోటులకే చెల్లదగిన, పద్ధతులు. వీటన్నిటినీ సహించుకునడం ఇండియాను అవమానించడమే అవుతుంది. సంస్థానాలు విశాలమైన జైళ్ళలాగుఉండి, ప్రజాధనం సంస్థానాధిపతుల దర్జాలకు వినియుక్తమై, ప్రజలు తిండిలేక, చదువులేక అధోగతిలో పడిఉండాలా? బ్రిటిష్ సామ్రాజ్యవాదపు సంరక్షణక్రింద ఇండియాలో మధ్యయుగ పరిస్థితులు సాగుతూఉండాలా?

రాజపుటానాలో ఒక ముఖ్యమైన సంస్థానంలో బైపుయంత్రాలనుకూడా వాడనివ్వరు. వీటిమీద ఒక ఆర్డినెన్సు. ఇవి వాడడానికి రిజిస్ట్రేషను అవసరం. కాశ్మీరులో చాలా కాలంక్రిందట బర్మా తిరుగుబాటును అణచడానికి జరిగిన ఆర్డినెన్సు వంటిదే ఎల్లప్పుడూ వర్తించే న్యాయశాసనం. పెద్ద సంస్థానమైన హైదరాబాదులో చాలాకాలంనుండి పౌరస్వత్వంకనబడదు. శాంతియుతంగా సత్యాగ్రహం చేసిన వారిని క్రూరంగా హింసించినట్లు ఇటీవల అచ్చటినుండి కొన్నివార్తలు బయలుపడుతున్నవి. వందేమాతరం పాట

పాడినంతమాత్రాన ఉస్మానియా యూనివర్సిటీనుండి వందలకొలది విద్యార్థులను తరిమివేయడం హైదరాబాదు పరిపాలకుల వింతమనః ప్రవృత్తికి నిదర్శనం. క్రిందటి వేసవిలో తిరువాన్కూరులో జరిగిన దారుణాలు మనం ఇంకా మరిచిపోలేదు.

భారతదేశసమస్యలను విడదీయనీలులేదు.

ఇప్పుడు నేను సంస్థానముల పట్టికను గాని అవిచేసిన అక్రిమచర్యలనుగాని, ఒక్కొక్క సంస్థానమునకుగల సమస్యలనుగురించిగాని చర్చింపదలచుకోలేదు. నేను ఆ విషయాలు చెప్పవలసివస్తే నా ఉపన్యాసము ఎప్పటికీ పూర్తిఅయ్యేదికాదు. ఇక్కడ మనము సమావేశమైన ప్రదేశానికి దగ్గరగానే పంజాబు సంస్థానాలు ఉన్నాయి. ఇవి చాలా కాలమునుండి అప్రతిష్ఠకు పాలుపడి ఉన్నాయి. అక్కడ జరుగుతున్న దురన్యాయములను వర్ణించడం ప్రారంభిస్తే మనకాలముఅంతా దానికి సరిపోదు. కాబట్టి దేశకాలముల ప్రసక్తి వదలిపెట్టి అన్నిసంస్థానములకు వర్తించు పెద్ద సమస్యలనుగురించి మనము శ్రద్ధవహించాలిగాని ప్రత్యేక సమస్యల చిక్కులలో దారి తెలియక పడిపోకూడదు. మనము అరణ్యమును చూడవలసిందేగాని చెట్లలో తప్పిపోకూడదు. భారతదేశ స్వాతంత్ర్యము అవిభక్తమగు సమస్య కాబట్టి ఇట్టి గొప్ప సమస్యను ఖండించి, చర్చించుటవలన ప్రయోజనము లేదని మనముగ్రహించి ఇతరులు ఆవిషయమును గ్రహించు కునేలాగ చేయాలి.

కాని నేడు స్వాతంత్ర్యసమరములో కొన్ని సంస్థానాలు చాలాముందుకు వచ్చి ఉన్నాయి. కాబట్టి వాటినిగురించి చెప్పవలసిఉంది. కొన్ని చాలావిచిత్రి పరస్థితులలో ఉండుటవలన వాటినిగురించి ఆలోచించవలసిందే.

రాజకోట జయపూర్

రాజకోట, జయపూర్ సంస్థానాలు--రెండూ నేడు రంగము మీదకు వచ్చి ఉన్నా, ఈ రెండింటినుండీ అఖిలభారత దేశమునకూ ముఖ్యమయిన సమస్యలు బయలుదేరినాయి. మనమిత్రులు చాలమంది అక్కడ పోరాటము మధ్య చేరిఉన్నారు. అక్కడ వారికి చాలా ముఖ్యమైన పనులు ఉండడంచేత వారు యీ సమావేశానికి రాలేకపోయినారు. రాజకోట మనకు అనేక గుణపాఠములు నేర్పగలదు. కొన్ని నెలలు పోరాటము గడిచినతరువాత ప్రజలు గెలిచినట్లు మనకు కనబడగా, మనము ఎంతో ఆనందించినాము. కాని ఇప్పుడు మనకు మనపోరాటములో పద్ధతి, తెలిసింది. మన ప్రజల ధైర్యసాహసమును, త్యాగమును మనకు విజయము చేకూర్చింది. కాని మనము చాలాముందుగా ఆనందించాము. సంస్థాన పరిపాలకుడు ఆడినమాట తప్పటచేత, తిరిగి క్రొత్తగా పోరాటము ప్రారంభించవలసివచ్చినది. ఏలాగ బ్రిటిషు అధికారులు ఒత్తిడి కలిగించి, భయపెట్టి, యీప్రకారము చేసినారో భారతదేశము అంతటికీ తెలిసినదే.

దీనినిబట్టి మధ్యకాలములో గలుగు తాత్కాలిక జయమునకు మనము ఆనందించకూడదని నేర్చుకోవాలి.

మనకోరిక యీడేరనంతవరకూ విజయముగురించి తలపెట్ట కూడదు. వాగ్దానములను, పూచీలను ఎవ్వరూ నిలుపుకోరు. ఎందుకంటే అసలు అధికారమంతా బ్రిటిషు సామ్రాజ్య తత్వానికే ఉంది గాని వాగ్దానాలుచేసేవారి చేతులలోలేవు.

జయపూర్‌లో ఒక ఆంగ్లేయఉద్యోగి ఉన్నాడు. మహారాజు అతనిని ప్రధానమంత్రిగా నియమించినప్పటికీ, అతడే ఆసంస్థానములో పరిపాలకుడు. బహుశా భారతదేశ ప్రభుత్వరాజకీయ శాఖ పక్షమున వారి సూచన ప్రకారము పరిపాలన సాగిస్తూ ఉంటాడు ముఖ్యవిషయములలో యువకులైన మహారాజుకు భాగము ఉందని ఎవ్వరు అనుకోరు. భారతదేశ ప్రభుత్వ సహకారములేనిదే ఇంగ్లీషు మంత్రి ఒక్కరోజైనా ఆవిధంగా పరిపాలన సాగించగలడని ఎవ్వరు అనుకోరు.

ఇతని విధానమును రాజకీయ శాఖవారు ఎంత మాత్రము ఆమోదింపక పోయినా, విధానాన్ని వెంటనే మార్చివేయవలసి వస్తుంది. లేదా అతనిని వెంటనే పదవి నుండి తొలగిస్తారు.

ఒరిస్సాలో బ్రిటిషు ఏజెంటు మెజర్ బేజల్గెట్ హత్యజరిగింది. ఇటువంటి శోచనీయమైన పనిజరుగుటవలన, చాలా విపరీతమైన పరిస్థితులు ఏర్పడినాయి. ఒరిస్సా సంస్థానములలో ప్రజలు చాలా వెనుకబడిఉన్నారు. కాని వారు మన ముఖ్య సూత్రములను గ్రహించుకోలేకపోయినందున బాధపడవలసిఉంది. కాబట్టి యీ చర్యను మనము ఒక హెచ్చరికగా తీసుకుని, ప్రజలు అహింసా విధానమును

గుర్తెరిగి దానికి అనుబద్ధులై ఉండేలాగ మన ఉద్యమములను సాగించవలసిఉంటుంది. వారు యీ విషయాన్ని మరచిపోయి నట్లయితే వారి ప్రయత్నములకే విఘాతము కల్పించుకున్న వారు అవుతారు.

కొండజాతులమీదికి సేనలు తీసుకురావాలా?

రాన్‌పూర్‌లో బ్రిటిషు అధికారులు కలుగజేసు కోవడంవల్ల కలిగిన ప్రమాదము అందరికీ బోధపడింది. భారతదేశములో దూరప్రదేశములనుండి మిలిటరీని తెప్పించి నారు. ఒరిస్సాలో యీ సేనలన్నీ చేరగానే బ్రిటిషు ప్రభుత్వబలము ప్రకటనార్థము ప్రదర్శించినట్లయింది. ఈ సేనలు ఏమిజేస్తాయనుకున్నారు? విప్లవములేదు, దౌర్జన్యాత్మక మైన తిరుగుపాటు కలుగలేదు. తిండిలేక మాడుతున్న బీద రైతులు సేనలనుచూడగానే పారిపోయినారు. రాన్‌పూర్ సంస్థానము నిర్జనమయిన అడివి అయిపోయింది. గోండ్లు అను అనాగరిక పర్వత జాతులవలన ఆందోళన కలుగుతుం దనుకున్నారు. మన దేశములోని బీద అడవిజాతులవారు విల్లుఅమ్ములూ పుచ్చుకువస్తే వారిని ఎదురుకోడానికి ఇంత మంది బ్రిటిష్ సేనలను తెప్పించాలా? అయినా గోండ్లు ఏ నేరమూ చేయలేదు, ఇకముందు చేయబోరు. వారిని దుర్భర దారిద్ర్య పరిస్థితులలో ఉసికొల్పితేనేగాని యే దౌర్జన్య మునకూ లేవరు.

వారిని దయతో చేరదీసి, వారి ఇబ్బందులను తొల గించాలి, కాని సామ్రాజ్యతత్వము అవలంబించిన పద్ధతి వేరు.

గోండ్లు పెద్ద ఆందోళన కలిగిస్తారని చెప్పి, వారిని ఎదురుకోడానికి సైనికులను ఒరిస్సాకు తెప్పించలేదు. కేవలము రైతులను భయపెట్టి వారి కోరికలను నిరాకరించుటలో పరిపాలకుని శక్తిని బలపరుచుటకోసమే సేనలను పిలిపించినారు ఆసేనలను స్వాతంత్ర్యోద్యమాన్ని అణిచివేయడానికి ఉపయోగించినారు.

బ్రిటిషు ప్రభుత్వము కలుగజేసికోడం అన్యాయం

ఇలాగ ప్రజలను పీడించడానికీ, అక్రమపరిపాలన సాగించుటకు బ్రిటిషు సామ్రాజ్యాధికారులు గలుగజేసుకోడం చాలా అన్యాయము. భారతదేశములోవున్న అన్ని సంస్థానములలోను ఒరిస్సా సంస్థానాలు చాలా చెడిపోయి నీచస్థితిలోఉన్న సంగతి అందరికీ తెలిసిందే. 'రాణ్ పూర్ విషాదమునకూ, మేజర్ బెజల్ గెట్టీ హత్యజరుగుటకూ పూర్వము ఢెంకనాలు, తల్చేరు సంస్థానములలో నిర్బంధపరిపాలనా విధానమువలన అనేక మంది సంస్థానప్రజలు సంస్థానాలు వదలిపెట్టి ఇతరస్థలాలు చేరుకున్నారు. ఇరవై లేక ముప్పది వేలమంది సంస్థానప్రజలు సంస్థాన సరిహద్దులనుదాటి ఒరిస్సా రాష్ట్రములో ప్రవేశించినారు. ఈవిధము సంస్థానములనుండి ప్రజలను బయటికి తీసికుపోయిన నాయకులను తిరిగి సంస్థానములకు అప్పగించమనీ, అప్పుడు సంస్థాన పరిపాలనను ప్రతిఘటించినందుకు వారిని బాధలకు పాలుచేస్తామని సంస్థానాధీశులు కోరుతున్నట్లు తెలుస్తోంది.

ఈ కోరికను బ్రిటిషు అధికారులు ఆమోదించి బలపరిచినారు, మన సూత్రములను తప్పకుండా, సంస్థాన ములలోని మనమిత్రులను మోసగించకుండా వారి గౌరవ మర్యాదలను కాపాడదలచిన ఏ కాంగ్రెసు ప్రభుత్వము ఇటువంటికోరికను ఆమోదించలేదు.

దోషులను దాచమనడంలేదు

మనము దోషులను దాచుటకు ప్రయత్నించడములేదు. వారినిగురించి సంపూర్ణముగా విచారణ జరిపించడానికి. కాని విచారణ చేయవలసివస్తే ఛెంకానాలు, తల్వేరు ప్రభుత్వ ముల దుష్పరిపాలనను, నిర్బంధవిధానమునే విచారణ చేయించవలసి ఉంటుంది, సంస్థానప్రజలకు దౌర్భాగ్య దుస్థితులను తెచ్చిపెట్టిన సంస్థానాధికారులనే విచారణ చేయ వలసి ఉంటుంది.

గురువుకు తగిన శిష్యులు.

పెద్దసంస్థానములలో ప్రభుత్వాధికారులు బ్రిటిషు సామ్రాజ్య తత్వానికి తగిన శిష్యులు అయిఉన్నారు. వీరు బ్రిటిషు సామ్రాజ్య తత్వమునుండి నేర్చుకున్న అనేక విష యాలతోపాటు ప్రజోద్యమములను అణిచివేయుటకు మత కలహములను సాకుగా ఉపయోగించుకోడంకూడా నేర్చు కున్నారు. తిరువాన్కూరులో సక్రమముగా సాగుతున్న ప్రజల ఉద్యమమునకు మతకలహము అను పేరుపెట్టి ప్రభుత్వము అణిచివేస్తోంది. ఈ ఉద్యమములో క్రైస్తవులే హెచ్చుమంది ఉన్నారు. కాశ్మీరులో ఆందోళన చేస్తున్న

వారు హెచ్చుమంది ముస్లిములు అవుటచేత అదీ మతకల హామే అన్నారు. హైదరాబాదులో హిందువులే హెచ్చు మంది ఆందోళన సాగించుటచేత అదీ మతకలహామే నన్నారు.

కాని యీ సంస్థానములలో ఉద్యమాలన్నీ జాతీయ మైనవే. వాటికి మతసంబంధము లేదు. కాని, మతసంబంధ మైనవని ఒక సాకుచెప్పి ఉద్యమములకు అప్రతిష్ఠ తెచ్చి వాటిని అణిచివేయడానికి మాత్రం సాకు చాలా బాగా ఉపయోగపడుతోంది.

హైదరాబాదు: కాశ్మీరు

భారతదేశములో హైదరాబాదు, కాశ్మీర సంస్థాన ములు మిక్కిలి ప్రధానమైనవి. ఈ రెండు సంస్థానాలూ స్వాతంత్ర్య సంస్థలను, బాధ్యతాయుత పరిపాలనను ప్రవేశ పెట్టి ఇతర సంస్థానములకు మార్గదర్శులు అవుతాయను కున్నాము. దురదృష్టవశాన ఈ రెండు సంస్థానములూ రాజకీయ, సాంఘిక విషయములలో చాలా వెనుకబడి వున్నాయి. హైదరాబాదు సంస్థానములో హెచ్చుమంది హిందువులే. వారికి ముస్లిం పరిపాలకుడు ఉన్నాడు. కాశ్మీ రములో హెచ్చుమంది ముస్లిములే. గని వారి పరిపాలకుడు హిందువు అయిఉన్నాడు. కాబట్టి యీ రెండు సంస్థానముల లోను ఒకటేవిధమైన సమస్యలు బయలుదేరినాయి. పరిస్థితు లన్నీ సమానమే. జనబాహుళ్యము రెండింటిలో దుర్భర దారిద్ర్యము అనుభవిస్తోంది.

ప్రజలకు విద్యలేదు. పరిశ్రమలు వెనకబడినాయి. ధనాదాయ మార్గములులేవు. మరొక పరిపాలకులస్థితి వీటికి

అంతావిపరీతం. ఈ రెండు సంస్థానముల పరిపాలకులూ భారతదేశములో మిక్కిలి ధనవంతులైనవారు. కాశ్మీరములో ఒక లెజిస్లేటివు అసెంబ్లీ అంటూఉన్నది గనక యిది హైదరాబాదుకన్న రాజకీయముగా కొంచెము పైమెట్టులో ఉంది. కాని యీ శాసనసభకు ఏ అధికారమూలేదు. భారతదేశము అంతటికీ హైదరాబాదు ప్రజలు అత్యల్పమైన పౌరసత్వహక్కులను అనుభవిస్తున్నారు. ఈ మధ్య కొన్ని మతఉత్సవములుకూడా జరుగకూడదని నిషేధము జరిగింది. హైదరాబాదులో ప్రజల ఆందోళనవలన ఇటువంటి తక్కువ స్థితి ఏర్పడలేదు. ఎంతో కాలమునుంచీ వ్యవహారాలు యిలాగ మొదగిల్లుతూఉన్నాయి.

ఈ రెండు గొప్ప సంస్థానములలోను అటువంటి పరిస్థితులు ఏర్పడడము మిక్కిలి విచారకరముగా ఉంది. ఆ రెండింటిలోను ప్రజాందోళనలు బయలుదేరి ప్రజలలో వ్యాపించుకోవడముసహజమే. ఇలాగ ఆందోళన మొదట కాశ్మీరులోను, తరవాత హైదరాబాదులోను బయలుదేరినవి అటువంటి ఉద్యమాలు బయలుదేరినప్పుడు అవి కాశ్మీరులో ప్రజాధికులగు ముస్లిములకు, హైదరాబాదులో ప్రజాధికులగు హిందువులకు వ్యాపించకుండా ఉండలేదు. ఈ పరిస్థితులలో ఉద్యమానికి మొదట కొంత మతస్పర్శకనిపించినా దానిలో విశేషములేదు. మతస్పర్శఉన్నా అవి ప్రజాందోళన కాకపోదు. ఈ ఉద్యమాలు ప్రజలజాతీయ వాంఛలను తెలియపరచుచున్నవి. గనుక ఇవి సంస్థాన ప్రజలందరి ఇబ్బందులనూ తీర్చి వారిని అభివృద్ధి పరుస్తాయి.

కాబట్టి యీ ఉద్యమములను మత కలహాలని ఖండించినట్లయితే బుద్ధి పూర్వకముగా అసలు నిజానికి కన్నులు మూసుకున్నట్లు అవుతుంది. సంస్థానములలో అల్పసంఖ్యాకులగువారు యీ ఉద్యమానికి మతస్వరూపము కల్పించి, దానిని ఖండించినట్లయితే అల్పసంఖ్యాకులు, వారి యోగక్షేమములనే పాడుచేసుకున్నవారు అవుతారు. మైనారిటీలు ఉద్యమానికి మతస్వరూపము కల్పించినట్లయితే వారు ప్రస్తుతపరిపాలనలో ఎంతోకాలమునుండి కొన్ని ప్రత్యేక హక్కులను అనుభవిస్తున్నారని అభిప్రాయపడి వాటినే ఆశ్రయించుకుని స్వాతంత్ర్యమును అభివృద్ధిని ధిక్కరించినవారు అవుతారు.

నిజము చెప్పవలసివస్తే యీ రెండు సంస్థానములలోను ప్రజోద్యమాలు జాతీయపద్ధతులమీదనే బయలుదేరి అభివృద్ధి చెందినాయి. కాశ్మీరములో ఒక ఆనందకరమైన విషయము జరిగింది. ఏమంటే ముందు దృష్టిగల బుద్ధిమంతులు ప్రజలపక్షముగా చేరి జాతీయవాంఛను బలపరుస్తూ బాధ్యతాయుత పరిపాలన కావాలని కోరినారు. కనుక హైదరాబాదులో కూడా ముందు ఆలోచనగల ముస్లిములు ప్రజాందోళనలో కలుస్తారని ఆశిస్తున్నాను.

ఈ రెండు సంస్థానములలోను ఉద్యమముల నాయకులు మతవివాదములు లేకుండా చేయడానికి చాలా ప్రయత్నించినారు నాయకులు తాము గ్రహించిన విషయాన్ని మరిచిపోకూడదు. మరిచినట్లయితే తమ ప్రయత్నములకే భంగపాటు కలిగించుకున్నవారు అవుతారు. మైనారిటీలు

విషయాన్ని కూడా గ్రహించాలి. ఏమంటే ఎప్పటికైనా సంస్థానములలో బాధ్యతాయుతప్రభుత్వము రాక తప్పదు. స్వాతంత్ర్యము తెచ్చిపెట్టు అమూల్యములగు ఫలములను మైనారిటీలేకాక అందరూ సర్వసమానముగా అనుభవింప వచ్చును. కాబట్టి ఇటువంటిప్రజల ఉద్యమమునుచూచి దారినిపోవు ప్రేక్షకులవలె ఊరుకోడం మనభవిష్యజ్జీవనమునకు తగనిపని.

హైదరాబాదుకు, కాశ్మీరమునకు రెండింటికీ ముఖ్య సమస్య ఒక్కటే. వాటి స్వరూపాలు వేరుగాఉంటేనేమి? అందుచేత యీ రెండింటిలోని సమస్యలను కలిపి ఆలోచించి మైనారిటీల హక్కుల విషయములో పరిష్కారవిధానము తెలుపుట కష్టముకాదు. ఆ పరిష్కారవిధానము కాంగ్రెసు ఏర్పరచిన ముఖ్య సూత్రములకు అనుబద్ధమై బాధ్యతాయుత ప్రభుత్వమునకు సరిపడిఉండాలి.

హైదరాబాదులో కొంతకాలము క్రిందట మిక్కిలి వింత పరిస్థితి బయలుదేరింది. అందువలన ప్రజలు కొంత కంగారుపడ్డారు. సంస్థానకాంగ్రెసువారు శాంతముగా నిర్మాణ పద్ధతులప్రకారము సభ్యులను చేర్చుకొని సంస్థను బలపరుచుకొనుచుండగా దానిని శాసన విరుద్ధమైన సంస్థఅని నిషేధించినారు. ఈ సంస్థానము చిన్నప్పటినుంచీ అనాగరికపు ఆదికాలమునాటి ఆచారములతో పోషింపబడింది. కాబట్టి సంస్థాన కాంగ్రెసు సంస్థ సభ్యులను చేర్చుకోడంకూడ పనికి రాదని నిషేధించింది. కాని సంస్థాన కాంగ్రెసు యీ నిషేధ మును ఆమోదించలేదు. అందుచేత యథాప్రకారం తన

ఉద్యమాన్ని సాగించడం ప్రారంభించింది. దీనికై శాంతి యుతమైన సత్యాగ్రహము ప్రారంభమయింది. దానికోసం వందలకొలది ప్రజలు బాధపడవలసివచ్చింది. అప్పుడో లేక కొంతకాలము అయినతరవాతో ఒక భక్తుల సంబంధమైన సంస్థయు, ఒకమత సంస్థయు ఒకవిధమైన సత్యాగ్రహాన్ని ప్రారంభించినాయి. సాధారణముగా భారతదేశము అంతటా జరుగుతున్న కొన్ని ఉత్సవములను సంస్థానములో జరపకూడ దని నిషేధించినందుకు అసమ్మతి సూచకముగా ఆభక్తుల సంస్థ సత్యాగ్రహము ప్రారంభించినది. ఆరాధన విషయములో స్వాతంత్ర్యమును మూలంట తెగనరుకునట్టి చర్యను పరిపాలకులు తీసుకోడం చాలా విచిత్రముగాఉంది. అందరూ వృత్తిగా పెట్టుకున్న విధానమునకు భంగము కలిగించినందున ప్రజలకు ఆగ్రహము కలిగిఉంటుంది. కాని దీనిని ఆధార ముగా చేసుకుని సత్యాగ్రహము ప్రారంభించడం చాలా శోచనీయమైన విషయము.

అంతట యీ సమస్య ప్రజలలో కొంత కంగారు పెట్టింది. అందుచేత సంస్థానాధికారులు స్వాతంత్ర్యవాంఛను వెనుక తోసివేయుటకు ఒక సాకు దొరికింది.

పరిస్థితులన్నీ జాగ్రత్తగా ఆలోచించి, స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం విరమించింది. కాని సత్యాగ్రహం, ఖైదీలను మాత్రం హైదరాబాదు అధికారులు విడుదల చెయ్యలేదు.

కులతత్వము, మతభావాలూ పురస్కరించుకొని జరిగిన సత్యాగ్రహాలు కాబట్టి వీటికి రావలసినంత రాజకీయ

ప్రాముఖ్యం రాలేదు. అందువల్ల స్వాతంత్ర్యోద్యమం వెనుకబడింది.

కాశ్మీరంలో కూడ క్రిందటియేటి శాసనోల్లంఘనం విరమించి అధికారులకు సంస్కరణలకు అవకాశం ఇచ్చారు. కాని అచ్చటకూడా అధికారులు దూరదృష్టితో వర్తించ లేదు. శాసనోల్లంఘన ఖైదీలు వారి నాయకుడు షేక్ మహమ్మద్ అబ్దుల్లా ఇంకా జైళ్ళలో మ్రగ్గుతున్నారు. ఆర్డినెన్సులే ఇంకా పనిచేస్తున్నవి.

కాశ్మీరు, హైద్రాబాదులలో ఈ పరిస్థితులను ప్రజలు సహించరు. సంస్థానాధికారులు వెనుకటివలెనే వర్తించసాగితే మళ్ళీ శాసనోల్లంఘనం బయలుదేరక తప్పదు.

మనకెవ్వరికీ సంఘర్షణ వాంఛలేదు, అల్లకల్లోలం కావడం ఇష్టంలేదు. కాని విషయపరిస్థితులు అన్నిదిక్కుల నుండీ ముసరుకొని వస్తున్నవి. స్వాతంత్ర్యం పోరాటమువల్లనే తప్ప లభించేటట్లు కనబడలేదు. ఎంత శిధిలోన్ముఖమైనా బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఇంకా బలిష్టంగానే ఉన్నది. దీనిని ఎదుర్కొనవలసిన బాధ్యత వహించినవారు ఎంతకైనా సాహసించాలి. మాటలతో పనిజరగదు. ఇప్పుడు కావలసినవి పనులు. మనంచేయగల మహా కార్యాలవల్లనే మన గమ్యస్థానం దగ్గరపడగలదు.

అల్పలాభాలు ఒకొక్కప్పుడు మనలను ఆశపెట్ట వచ్చును. కాని మన గమ్యాన్ని ఉద్దేశించి వాటిని తిరస్క రించాలి. మన గమ్యం అమోఘమైనది, అల్పత్వానికి అక్కడ అవకాశంలేదు.

సంస్థాన ప్రజాసమస్య గొప్పదే. కాని అంతకన్నా గొప్పది భారతదేశ సమస్య, ఫెడరేషను మన నెత్తిని రుద్దితే దాన్ని తుడిచివేస్తాము. స్వతంత్ర్య భారతప్రజలకాన్స్టిట్యుమెంట్ అసెంబ్లీ స్థాపించుతాము.

సంస్థాన ప్రజా సమావేశం ఇదివరకు చాలా పనులు నిర్వర్తించింది. ఇకముందు ఇంకా గొప్ప పనులు నిర్వహించాలి. కుల తత్వాలు మరచిపోవాలి. అహింసను విడనాడకూడదు.

సంస్థాన సమస్యలకు కాంగ్రెసూ, కాంగ్రెస్ నాయకులూ సానుభూతి తెల్పడం మన అదృష్టం. అన్నిటికంటె పరమహర్షకరమైన సంగతి గాంధీమహాత్ముడు మనకు మార్గదర్శకులు కావడం.

---

(ఆం. ప్ర. నుండి పునర్ముద్రితము)

కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాల, శికింద్రాబాద్.

# ప్రజాభిప్రాయములు.

## ప్రాథమిక స్వత్వములు.

---

(గ్రం. సు. ప్రతాపరెడ్డిగారు. బి. ఏ., బి. ఎల్.)

---

"ఇది ప్రతిరోజు ప్రతియాంధ్రుడు పారాయణం చేయదగ్గగ్రంథం. ధార్మిక గ్రంథ పారాయణంచేత ధార్మిక భావాలు గట్టి పడేలాగు ఈ గ్రంథ పారాయణంవల్ల రాజకీయ, ఆత్మీయ, స్వాతంత్ర్యభావాలు గట్టిపడుతాయి"

—భారతి

"ప్రాథమికస్వత్వములు లేని మానవ జన్మ నిరర్థకమను భావ ముట్టిపడు నట్లుగా వ్రాయబడినది."

—గృహలక్ష్మి

"దేశదేశములందలి స్వాతంత్ర్య సమరముల చరిత్రలు, స్వాతంత్రోద్యమ స్వరూపము, హైద్రాబాదులో అమలునందున్న ప్రజాస్వత్వములు ఈ గ్రంథ మందు చక్కగా వివరింపబడియున్నవి. స్వాతంత్రోద్యమమును తెలియగోరు వారికిది చాల ఉపకరించును"

—ఆంధ్రవార

"స్వాతంత్ర్యహక్కుల పోరాటము, మానవుని పౌరస్వత్వ హక్కులు సంపాదన ఈ పుస్తకములో క్లుప్తంగా సింహావలోకనముంది. అందరూ ముఖ్యంగా నైజాం ప్రజలు చదవాలసినపాత్రం"

—నవశక్తి

"బాధ్యతాయుతప్రభుత్వం అంటే ఏమిటో తెలుసుకోవడానికి ఈ పుస్తకం చాలా ఉపయోగపడుతుంది"

—ఆంధ్రవాణి

"ఈ గ్రంథమందు వివిధకాలములందు మానవుడు స్వాతంత్ర్యముకొరకై గావించిన పోరాటము, నవీనకాలమున ఫ్రాన్సు, అమెరికా, ఇంగ్లాండు, స్విట్జర్లండు రష్యా దేశములలోని స్వాతంత్ర్య లక్షణములు, భారతదేశము గూర్చియు, మ. ఘ. వ. నిజాంరాష్ట్రములలోను స్వాతంత్ర్యావకాశములు సామాన్యజనులకు తెలియునట్లు చర్చింపబడియున్నవి"

—గోలకొండ

# వెలువడిన గ్రంథములు



| | సభ్యులకు | యితరులకు |
|---|---|---|
| * ౧. హైందవధర్మపోలీలు. | ౦-౪-౦ | ౦-౬-౦ |
| ౨. రైతు—భూమి—ఋణము. | ౦-౧౦-౦ | ౦-౧౦-౦ |
| (అనుబంధ ప్రచురణము) | | |
| ౩. ప్రాథమిక స్వత్వములు. | ౦-౪-౦ | ౦-౫-౦ |
| (అభివృద్ధి పక్షసభ్యులకు ఉచితము) | | |
| ౪. సంస్థాన ప్రజల సమస్యలు | ౧-౨-౦ | ౦-౨-౦ |
| (అనుబంధప్రచురణము ౨) | | |

# వెలువడనున్న గ్రంథములు



† ౧. ముస్తఫా కమాల్ పాషా (రెండు భాగములు)

౨. దేశీయసంస్థాన సమస్యలు.

౩. గాంధిత్వము—సామ్యవాదము.

౪. దేశీయసంస్థానములు.

౫. గ్రామజన దర్పణము.

౬. ఝాన్సి లక్ష్మిబాయి.

౭. జాగీర్లపరిపాలనము.

౮. ప్రజలు—ప్రభుత్వము.

౯. నిత్యజీవనమందు విజ్ఞాన శాస్త్రము.

---

* అచ్చులోనున్నది (రెండవ ముద్రణము)

† అచ్చులో నున్నది.

---

కొండా శంకరయ్యగారి ప్రిన్టింగ్ ముద్రాక్షరశాల, సికిందరాబాద్.